# ఇరవై ప్రేమ కవితలు మరియు ఒక విషాద గీతము

## పాబ్లో నెరుడా

(Twenty Love Poems and a Song of Despair)

స్వేచ్ఛానువాదం
బొల్లోజు బాబా

## స్త్రీ దేహమా! (Body of a Woman)

తెల్లని గిరులు, ఊరువులతో
నీవు వశమయిన ప్రపంచంలా కనిపిస్తున్నావు.
ధృఢమైన నా రైతు దేహం నిన్ను దున్నుతోంది
అవని లోతుల్లోని శిశువును పైకి తీసుకు రావటానికై.

నేనో సొరంగంలా ఒంటరినై ఉండేవాడిని.
పక్షులు నాలోంచి ఎగిరేవి.
రాత్రి ముట్టడి చేసి నన్ను ముంచెత్తేది.
నే బతకటం కోసమే నిన్నో ఆయుధంగా చేసుకొన్నాను
నా ధనస్సులో బాణంలా నా ఒడిసెలలో రాయిలా.

కానీ ప్రతీకార క్షణాలు కరిగిపోయాకా
నిన్ను ప్రేమిస్తున్నట్లు గ్రహించాను.
చర్మం, మట్టి, వాంఛ, చిక్కని పాలు నిండిన దేహానివి నీవు.
ఓహ్! చనుధ్వయం విరహ నేత్రాలు
కటిప్రాంత ఎర్రగులాబీలు సన్నని విషాద స్వరంతో నీవు.

ఓ నా స్త్రీ దేహమా!
నీ సౌందర్యంలోనే నా మనుగడ.
నీవే నా దాహానివి, అంతే లేని నా కోర్కెవు, మారిపోయె నా మార్గానివి.

చీకటి నదీ గర్భాన
ఆధ్యంతరహితమైన దాహం ప్రవహిస్తూంటుంది.
అనంతమైన బాధ అలుపు అనుసరిస్తూంటాయి.

## 2. నిన్ను కప్పే కాంతి (The Light Wraps You)

కాంతి తన మృత్యు జ్వాలతో నిన్ను పెనవేసుకొంటుంది.
నీ చుట్టూ తిరిగే వెన్నెలకు అడ్డుగా
ఎవరో పరధ్యాన దు:ఖితుడు నిలచాడు.

గతించిన ఘడియ ఏకాంతంలో ఒంటరివై
జీవ జ్వాలలు నింపుకొని,
శిధిల దినపు నిజమైన వారసునిగా
మాటల్లేక మిగిలిపోయావా మిత్రమా.

నీ చీకటి దుస్తులపై ఫలమేదో సూర్యునినుండి రాలిపడింది.
రాత్రి వేళ్లు, అకస్మాత్తుగా నీ ఆత్మలోంచి మొలచుకొచ్చాయి.
నీలో దాగున్నవన్నీ మరలా బయటకు వచ్చేస్తున్నాయి.

ఒహ్! ఘనమైన, ఫలవంతమైన, ఆకర్షణీయమైన
చీకటి వెలుగులలో తిరుగాడుతూండే ఈ వలయం
పెంచి, నడిపించే ఈస్పృష్టి విషాదంతో నిండి ఉంది,
దాని పువ్వులు వాడిపోతూంటాయి

### 3. ఓహ్. పైన్ వనాల విశాలత్వమా (Ah Vastness of Pines)

ఓహ్!
పైన్ వనాల విశాలతా, పగిలే అలల గుసగుస
దీపకాంతుల సయ్యాట, ఏకాకి కాలం,
కళ్లల్లో కి జారే వెన్నెలా, ఆటబొమ్మా, చిరుగవ్వా
నీలోనే అవని గానం చేస్తోంది.

నీలో నదులు గానం చేస్తూంటాయి
వానిలో నీకు నచ్చిన విధంగా నా ఆత్మ
ఉరకలు వేస్తూంది.
నీకు కావలసిన చోట్లకు నాహృదయాన్ని పంపిస్తూంటావు.

నీ కోర్కెల శిఖరానికి చేరే నా మార్గాన్ని నిర్ధేశించు
నేను ఉన్మత్తుడనై నా శరపరంపరను వదులుతాను.

అన్నివైపులా నీ పొగమంచు నడుమే నాకు కనపడుతుంది.
బాధించే నా ఘడియలన్నింటినీ నీ మౌనం వేటాడుతుంది.
స్ఫటిక సదృశ నీ చేతులలో
నా చుంబనాలు లంగరు వేసుకొన్నాయి.
నా తడి వాంఛలు గూళ్లుకట్టుకొన్నాయి.

ప్రతిధ్వనిస్తూ,కృశించిపోయే
సాయింత్ర వర్ణాలు, గంటల శబ్దాలు
చిక్కబడే నీ మంత్రముగ్ధ స్వరం.
లోతైన ఆ ఘడియలలో
పొలాలలో గోధుమకంకులు గాలి నోటిలో
గంటలు వాయించటం నేను చూసాను.

**4. ఉదయం నిండుగా ఉంది (The Morning is Full)**

నడివేసవి హృదయంలోని
ఈ ఉదయం తుఫానుతో నిండిఉంది.

మేఘాలు తెల్లని చేతిరుమాళ్లులా ఉన్నాయి
గాలి వాటిని ఊపుతూ వీడ్కోలు పలుకుతూ సాగిపోతోంది.

మన నిశ్శబ్దంపై గాలి గుండె కొట్టుకొంటోంది.

తరువులమధ్య గొప్ప దైవీకమైన లయతో
ప్రతిధ్వనిస్తోంది యుద్ధగీతాల భాషలా

ఎండుటాకులపై మెరుపు దాడి చేసి ఎగరేసుకుపోయిన గాలి
బాణాల గుంపులా ఎగిరే పక్షుల గమనాన్ని దారిమళ్లిస్తుంది.

గాలి ఈ ఉదయాన్ని తలక్రిందులు చేస్తోంది.
నురుగులేని కెరటంలా, బరువులేని వస్తువులా, మీదపడే దావానలంలా

ఆమె చుంబనాలన్నీ పగిలి
ఈ వేసవి గాలులలో మునిగిపోతున్నవి.

### 5. నువ్వు వింటావని.... (So That You Will Hear Me)

నామాటలు నీవు వింటావని
ఒక్కోసారి సముద్రపొడ్డున కొంగల పాదముద్రల్లా
సన్నగా మారతాయి.

నీ చేతి గాజులు, మత్తెక్కిన కాలం
ద్రాక్షల్లా మెత్తగా ఉన్నాయి.

నా పదాలను దూరంనుంచి పరిశీలించాను.
అవి నన్నుకంటే నిన్నే ఎక్కువ ప్రతిబింబిస్తున్నాయి.
నా పాత వేదనను లతలా పెనవేసుకొంటున్నాయి.

అది అక్కడి చిత్తడిగోడలపై అల్లుకొంటూంది.
ఈ మృగయావినోదానికి బాధ్యురాలివి నీవే కదూ!
నా పదాలు నా చీకటి గుహలనుండి పారిపోతున్నాయి.
నువ్వు అన్నిచోట్లా నిండిపోతున్నావు, అన్నిచోట్లా.

నీ ఏకాంతంలోకి నీకన్నా ముందే నా పదాలు చేరి
పొటమరిస్తున్నాయి.
నీకంటే కూడా వాటికి నా విషాదం తోనే పరిచయం ఎక్కువ.

నీకేం చెప్పాలనుకొంటానో దానినే నా పదాలు చెప్పాలనుకొంటాను.
నువ్వేం వినాలనుకొంటావో దానినే అవి వినిపించాలనుకొంటాను.
వేదనా గాలులు నాపదాలను ఈడ్చుకుపోతూంటాయి ఎప్పట్లానే!
ఒక్కోసారి కలల తుఫానులు వాటిని మరింత ధ్వంశం చేస్తాయి.
నా విషాద స్వరంలో నీవు ఇతర స్వరాలను వింటావు.

నా సహచరీ!, ప్రేమించు, నన్ను చేజార్చుకోకు.
చెలియా! నా వెంటరా. ఈ వేదనా కెరటంపై నన్ను అనుసరించు.

నా పదాలనిండా నీ ప్రేమ మరకలే!
నీవు అన్నీ ఆక్రమించేసావు. అన్నీ.

నా పదాలను చెక్కుతున్నాను గాజులుగా
ద్రాక్షల్లా మెత్తగా ఉండే తెల్లని నీచేతులకొరకు

**6. పోయిన శరత్తులో నీవెలా ఉన్నావో అలానే నాకు గుర్తు (I Remember You As You Were)**

పోయిన శరత్తులో నీవెలా ఉన్నావో అలానే నాకు గుర్తు
ఆకుపచ్చని టోపీతో....
ఒక నిశ్చల హృదయానివి.
నీ కళ్లల్లో వెన్నెల మంటలు కదం తొక్కేవి.
నీ ఆత్మజలాలపై ఆకులు రాలుతూండేవి.

నా చేతులపైకి ఎగబ్రాకుతోన్న ద్రాక్షతీగ ఆకులు
ఏమాత్రమూ ఆత్రములేని నీ ప్రశాంత స్వరాన్ని పీల్చుకొంటున్నాయి.

పారవశ్య జ్వాలలలో నా దాహం దహింపబడింది
తీయని నీలి కలువ నా ఆత్మతో మెలికపడింది .

నీ నయనాలు దూరమయ్యాయి, శరత్తూ సుదూరంగా ఉంది.
నా ప్రగాఢ వాంఛలు
ఆకుపచ్చటోపీ వైపు, పిట్టగానం వైపు,
ఇల్లులాంటి హృదయంవైపు వలసపోయాయి.
నా ఉల్లాస చుంబనాలు బూడిదలా నేలరాలాయి.

కాంతిలో, పొగమంచులో, ప్రశాంత తటాకంలో
నువు నాకు గుర్తుకు వస్తున్నావు.

నీ కనులకు కనిపించనంత దూరంలో వెన్నెలలు కాలుతున్నాయి.
హృదయంలో శుష్కించిన శిశిర పత్రాలు సుళ్లు తిరుగుతున్నాయి.

## 7. మధ్యాహ్నంలోకి సాగిలపడి (Leaning Into The Afternoons)

మధ్యాహ్నంలోకి సాగిలపడి
నీ సాగరనయనాలలోకి నా విషాద జాలాల్ని విసిరాను,

ఆ ప్రచండ జ్వాలలో నా ఏకాంతం రగిలిపోతోంది
దాని చేతులు మునిగిపోతున్న మనిషిచేతుల్లా కొట్టుకొంటున్నాయి.

లైట్ హౌస్ వద్ద సంచరించే సముద్రంలాంటి నీ అభావ నేత్రాలకు
నా ప్రమాద సంకేతాలను పంపించాను.

నా సుదూర ప్రేయసీ!
నీవు చీకటిని మాత్రమే ధరిస్తావు.
ఒక్కోసారి దిగులుతీరం బయటపడుతూంటుంది.

మధ్యాహ్నంలోకి సాగిలబడి
నీ నయనాలలో ఎగసిపడే సాగరంలోకి నా విషాద జాలాల్ని విసిరాను.

నిను నే ప్రేమించేపుడు ప్రకాశించే నా ఆత్మ లా
తళుకుమంటూన్న తారలను పక్షులు పొడుస్తున్నాయి.

నీడల గుర్రమెక్కి, రాత్రి
నేలపై నీలి కుచ్చులను రాల్చుకుంటూ సాగుతూంది.

## 8. శ్వేత మధుపమా! (White Bee)

శ్వేతమధుపమా! తేనెనింపుకొని
పొగమంచులో సుళ్లుతిరిగే బాటను లిఖించి మాయమయ్యావు.
నీవు నా ఆత్మలో ఇంకా ఝుమ్మంటున్నావు.

నేను మాత్రం ఏ ఆశా లేని వ్యక్తిని, ప్రతిధ్వనులు లేని పదంలా.
అన్నీ ఉన్నా ఏమీ లేనివాడిని.
నా చివరి అన్వేషణ నీతోనే ముగుస్తుంది.
నీవు నా ఎడారి నేలపై ఆఖరి రోజావు.

ఓహ్! మౌన రూపమా!

నీ లోతైన కనుల వెనుక రాత్రి రెపరెపలాడుతోంది.
నీ దేహముంది చూడు, అదో చకిత నగ్నశిల్పం.

నీ లోతైన కనులలో రాత్రి తపతపలాడుతోంది.
చల్లని పూలచేతులు, రోజాల ఒడి నీవు.

నీ చనులు తెల్లని నత్తలలా అనిపిస్తున్నాయి.
నీ బొడ్డుపై సీతాకోకచిలుక నిద్రించ వచ్చింది.

ఓహ్! మౌన రూపమా!

నీవు లేని ఒంటరితనమిది. వర్షం పడుతోంది.
సముద్రగాలులు దారితప్పిన కొంగల్ని వేటాడుతున్నాయి.

తడిచిన దారులలో నీరు అనాచ్ఛాదిత పాదాలతో నడుస్తోంది.

ఆ చెట్టు ఆకులు జబ్బుపడ్డామని చెప్పుకొంటున్నాయి

శ్వేత మధుపమా!
నీవు వెళిపోయాకా కూడా నా హృదయంలో ఝుమ్మంటున్నావు.
కాలంలో సన్నగా మౌనంగా మరలా జీవిస్తున్నావు.

ఓహ్! మౌన రూపమా!

## 9. వాంఛలతో మత్తెక్కి (Drunk with Pines)

వాంఛలతో, సుదీర్ఘ చుంబనాలతో మత్తెక్కి
వేసవిలాగ నా గులాబీల ప్రయాణాన్ని
పలుచని దినపు మృత్యువువైపు నడిపిస్తూ
గంభీర సాగర ఉన్మత్తతలో చిక్కుకు పోయాను.

బూడిద దుస్తులను, చేదుశబ్దాలను, శోక కిరీటాన్ని
ఇంకా ధరించేఉన్న వాతావరణపు పుల్లని వాసనలో
నా యానాన్ని సాగించాను, నా శోక జలాలచే లాగబడుతూ.

కోర్కెలతో కరడుకట్టిన నేను నా ఒకే ఒక్క కెరటాన్నధిరోహించి
సూర్యచంద్రుల్లా మండుతూ, వెన్నెల కురిపిస్తూ, రెండూ ఒకేసారి చేస్తూ
తెల్లని, తీయని, చల్లని జఘునాలవలెనుండే
అదృష్ట ద్వీపాల గొంతులో శాంతింపబడతాను.

ఈ తడి రాత్రిలో నా చుంబనాల దుస్తులు వణుకుతున్నాయి.
విద్యుదావేశంతో పిచ్చెక్కి, కలలు కలలు గా విస్ఫోటనం చెందుతున్నాయి.
మత్తుగొలిపే రోజాలు తమ ప్రావీణ్యాన్ని నాపై పరీక్షించుకొంటున్నాయి.

కెరటాలకవతల ఈ లోకపు వెలుగుల మధ్య
నీ దేహం నా చేతులకు చిక్కింది.
చలాకీగా, మెల్లగా నా ఆత్మలో బంధింపబడ్డ ఓ చేపలా.

### 10. చేజార్చుకొన్నాం (We Have Lost Even)

ఈ సంధ్యను కూడా మనం చేజార్చుకొన్నాం.
లోకంలోంచి నీలి రాత్రి ఊడిపడే సాయింత్రపువేళ
మనం చేతిలో చేయివేసుకొని సాగటాన్ని ఎవరూ గమనించలేదు.

ఆ దూరపు కొండల అంచులపై సూర్యాస్తమయ ఉత్సవాన్ని
నా కిటికీ లోంచి చూసాను.

ఒక్కోసారి ఒక సూర్యుని ముక్క నా చేతిలో నాణెమై మండేది.
నీకూ తెలిసిన నా విషాద హృదయంతో
నిన్ను నేను గుర్తుచేసుకొంటాను.

అప్పుడెక్కడున్నావు నీవు?
అక్కడ ఇక వేరే ఎవరున్నారూ?
ఏం చెపుతున్నారూ?
నీ వియోగంతో నే దుఖి:స్తున్నపుడు అకస్మాత్తుగా
మొత్తం ప్రేమంతా నన్ను ఎందుకు ముంచెత్తుతుందీ?

చేజార్చుకొన్న పుస్తకం ఎప్పుడూ సంధ్య పుటనే చూపిస్తూంటుంది.
నా పాదాలవద్ద తీరం గాయపడ్డ కుక్కలా దొర్లుతుంది.

పాలరాతి శిల్పాలను అదృశ్యం చేసే వెన్నెలలోకి
నీవు సాయింత్రాల గుండా ప్రతీసారీ జారిపోతూంటావు ...... ప్రతీ సారి.

## 11. ఆకాశం నుండి దాదాపు బయటకు వచ్చిన (Almost Out of Sky)

ఆకాశం నుండి దాదాపు బయటకు వచ్చిన
సగం చందమామ రెండు కొండలమధ్యా లంగరు వేసుకొంది
కళ్లుపొడిచే చీకటి రాత్రి.
కొలనులో ఎన్ని నక్షత్రాలు రాలిపడ్డాయో చూద్దాం రండి.

అది నాకళ్ల మధ్య విషాదాన్ని శిలువవేసి పారిపోయింది.
నీలి లోహాల కొలిమితో, నిశ్చలయుద్ధ రాత్రులతో
నా హృదయం ఓ ఉన్మత్త చక్రం లా తిరుగుతోంది.
నన్ను ఇంతవరకూ తీసుకొచ్చిన ఓ మగువా!
ఒక్కోసారి నీ చూపులు ఆకాశంలో మెరుస్తాయి
ఉరుములు, తుఫాను, హోరుగాలి భీభత్సం
నీవు నా హృదయాన్ని దాటుకొని ఆగకుండా సాగిపోతావు.
సమాధులమీదుగా వీచే గాలి
శిధిలాలను, ప్రశాంతతను చెల్లాచెదురుచేస్తోంది.

ఆవలఉన్న పెద్దపెద్ద తరువులు పెకిలింపబడ్డాయి.
నీవు మాత్రం నిర్మలమైన అమ్మాయివి, ప్రశ్నించే మంచువు, జొన్న కంకివి.
ప్రకాశించే పత్రాలను గాలి ఏంచేస్తుందో అదే నీవు.
రాత్రిగిరుల వెనుక తెల్లని లిల్లీల దావానలం.
అయ్యో! నేనేం చెప్పలేను.  నీలో సర్వం ఉన్నాయి.

నిరీక్షణ నా హృదయాన్ని ఛిద్రం చేసేసింది.
ఆమె పరిహాసించవీలులేని మరో దారి చూసుకోవాల్సిన
సమయమాసన్నమైంది.

తుఫాను కాలాన్ని కప్పెట్టేసింది.

కలకబారిన బాధల సుళ్లు తిరుగుతున్నాయి.
ఇపుడు ఎందుకు ఆమెను తాకుతావు, బాధిస్తావు?

అన్నిటినుంచీ దూరంగా తీసుకువెళ్లేదారిని అనుసరించు
బాధలు, మృత్యువు, మంచుబిందువులలో విప్పారిన కళ్లతో
ఎదురుచూసే శీతవేళల నుంచి దూరంగా తీసుకువెళ్లేదారిని అనుసరించు.

## 12. నీ చనులే చాలు (Your Breast is Enough)

నా హృదయానికి నీ చనులు చాలు
నీ స్వేచ్ఛకు నా రెక్కలు చాలు
నీ ఆత్మపై నిదురించేదేదో
నా నోటిలోంచి స్వర్గంలోకి లేస్తుంది.

కాలం చేసే మాయ నీలో ఉంది.
సుమపాత్రికలోకి మంచుబిందువులు
వచ్చినట్లు నీవు వస్తావు.
నీ నిష్క్రమణతో దిగంతాలను పరిహసిస్తావు
అలలా అనంతంగా ఎగసిపడుతో!

సరుగుడు తోటలా, తెరచాపకొయ్యలా
నీవు గాలిలో గానంచేస్తూంటావని అన్నాను.
వాటిలానే నీవూ పొడవు, మితభాషివి,
నీవు విషాదానివి కూడా లేదా
అన్నీ కలగలసిన సముద్రయానానివి.

పాతదారిలా నీవో ఆకర్షణవు.
ప్రతిధ్వనులు, పలవరింతలతో నిండి ఉంటావు.

నే కనులు తెరచేసరికి ఒకోసారి
నీలో నిదురించే పక్షులు లేచి
వలసపోతాయి.

## 13. నీ దేహ అట్లాసు (I have gone Marking)

నీ దేహ అట్లాసును చిత్రిస్తున్నాను నిప్పు రేఖలతో.
నాపెదవులతో, కోరికలతో, దాహంతో
నీలోకి, నీలోలోకి దాగిపోతున్నాను.

ఓ ముద్దుగుమ్మా!
ఈ సాయింత్రపు తీరంపై నిను సంతోషపెట్టటానికి
ఎన్ని కధలున్నాయో! ఒక కొంగ, ఒక చెట్టు, సుదూర ఆనందాలు,
మాగిన ఫలాలతో నిండిన ఈ ద్రాక్షఋతువు, ఇంకా మరెన్నో.

ఈ రేవులో సంచరిస్తూ నిను ప్రేమిస్తూ నేను.
నా ఒంటరితనం
కలలతో మౌనంతో పెనవేసుకొంది.
సంద్రానికి దుఃఖానికి మధ్య చిక్కుకుపోయింది.
ఆ ఇద్దరు నిశ్చల నావికుల మధ్య నిశ్శబ్ద మత్తులో జోగుతున్నది.

పెదాలకు స్వరానికి మధ్యనేదో అదృశ్యమౌతున్నది.
ఎగిరే పిట్టో, వేదనో లేక మైమరుపో!

నా ముద్దుగుమ్మా
నీటిని వల చిక్కించుకోలేకపోయినా
ఏవో కొన్ని బిందువులు వేలాడినట్లుగా
జారిపడ్డ ఈ పదాలలోంచి ఏదో గీతం వినిపిస్తుంది.
ఏదో గీతం నా దాహపు పెదవులపైకి ఎగబాకుతున్నది.

పాడనా, దహించుకుపోనా, పర్వులిడనా పిచ్చివాని చేతి గంటలా.
నా విషాద మృధుత్వమా

అకస్మాత్తుగా నిను ముంచెత్తేది ఏమిటనుకొంటున్నావు?

నేను సుందర శైత్యశిఖరాన్ని చేరినప్పుడు
నా హృదయం రాత్రి పూవు వలె ముడుచుకొంటుంది.

## 14. ప్రతీరోజు నువ్వు ఆడుకొంటావు (Every Day You Play)

రోజూ నీవు విశ్వకాంతితో ఆడుకొంటావు.
పూవులలోకి, జలాలలోకి నీవు అతిధివోలె వస్తావు సన్నగా.
నా యవ్వనం కన్నా నీవు ప్రియమైనదానవు.

నే ప్రేమించిననాటినుండీ నీవు మరొకరిలా కనిపించటం లేదు.
నిన్ను బంతిపూదండల మధ్య నన్ను పెదజల్లనీ.
తారల నడుమ నీ పేరును పొగ అక్షరాలతో ఎవరు వ్రాస్తారూ?
నీవు లేకముందు నీవెలా ఉండే దానవో నన్ను గుర్తుంచుకోనీ.

అకస్మాత్తుగా గాలి ఊళలు పెడుతూ
మూసిన నా కిటికీ రెక్కల్ని టపటపలాడిస్తుంది.
ఆకాశ వలనిండా నీడల చేపలు నిండాయి.
అన్ని గాలులూ ఇప్పుడో తరువాతో వెళిపోతాయి.
వాన తన దుస్తుల్ని తొలగిస్తుంది.

పక్షులు ఎగిరిపోతున్నాయి.
గాలి..... గాలి
మానవశక్తితో మాత్రమే నేను పోరాడగలను.
చీకటి ఆకుల్ని సుళ్లుతిప్పుతోంది తుఫాను.
నిన్నరాత్రి ఆకాశానికి లంగరు వేయబడ్డ
అన్నిపడవలను విడుదల చేసేస్తుంది.

నీవు ఇక్కడే ఉన్నావా. పారిపోలేదు కదూ.
నా ఆఖరు కేకకు నీవు బదులిస్తావు.
భయవిహ్వాలతపై నన్ను అల్లుకొంటావు.

అయినప్పటికీ ఒక్కోసారి
నీ కళ్లల్లో ఏదో తెలియని నీడ కదలాడుతూంటుంది.

ఇప్పుడు, ఇప్పుడు కూడా
నీవు తేనె రుచుల్ని తీసుకొస్తావు.
నీ చనులు కూడా తేనెవాసన వేస్తాయి.
శోక గాలులు సీతాకోక చిలుకలను సంహరించే వేళ
నేను నిన్ను ప్రేమిస్తున్నాను.
నా సంతోషం నీ పెదవులను కొరుకుతుంది.

నన్నూ, నా మొరటుతనాన్ని, నా ఒంటరిహృదయాన్ని,
వినటానికే ఎవరూ ఇష్టపడని నా పేరునీ
నీవు అలవాటుచేసుకోవటానికి ఎంత కష్టపడి ఉంటావో కదా!

మనమెన్నిసార్లు చూడలేదూ?
వేగుచుక్క మండుతూ మన కళ్లను ముద్దాడడం
వేకువ వెలుగు మన తలలపై సుళ్లుతిరుగుతూ విచ్చుకోవటం.

నా పదాలు నీ పై వర్షించి నిన్ను లాలిస్తూంటాయి.
నీ దేహసౌందర్యానికి ఆదిమ ప్రేమికుడని నేను.
నీలోనే విశ్వముందని నా విశ్వాసం.
నీకు నేను ఆ కొండలనుండి సంతోషసుమాల్ని, నీలి కలువల్నీ
అల్లనేరేడు పళ్లనీ, సజ్జలతో ముద్దులనీ తీసుకొస్తాను.
వసంతం చెర్రీ చెట్లతో ఎలా క్రీడిస్తుందో
నీతో నేను అలానే ఆడుకోవాలనుకొంటాను.

## 15. నీకోసం మౌనంగా ఉండటాన్ని ఇష్టపడతాను. (I like for you to be still)

నీవు నన్ను విననట్టు, నా స్వరం నిన్ను స్పర్శించనట్టు,
అచ్చు నీవు లేని విధంగా అయిపోవాలనుకొంటాను.

నీ నయనాలు మాయమైనట్లు,
నీ నోటిని ఓ చుంబనం మూసివేసినట్లు అగుపిస్తావిక.

అన్ని వస్తువులలోను నా ఆత్మ నిండిపోతుంది
ఆ వస్తువుల్లోంచి నా ఆత్మను నింపుకొని
నీవు పైకి లేస్తావు.
నీవు నా ఆత్మలా, సీతాకోకచిలుకలాంటి స్వప్నంలా
వేదన అనే పదంలా ఉంటావు.

నీకోసం మౌనంగా ఉండటాన్ని ఇష్టపడతాను.
నీవు మరింత దూరమౌతావు.
సీతాకోకచిలుక పావురంలా గుబగుబలాడినరీతిగా
నీవు శోకిస్తున్నట్లు శబ్దాలు వినిపిస్తాయి.
దూరంనుంచి నీవునన్ను వింటావు, నా స్వరం నిన్ను పూర్తిగా చేరలేదు.
నీ మౌనంలో నన్ను నిశ్చలంగా ఉండనీ.
దీపంలా కాంతిగొలిపే నీ మౌనంతో నన్ను నీతో మాట్లాడనీ.
నీవు మాత్రం తారావళిని అలంకరించుకొన్న నిశ్చల రాత్రిలా ఉంటావు.
సుదూరంగా స్వచ్ఛంగా ప్రకాశించే తారల మౌనం నీది.

నీకోసం మౌనంగా ఉండటాన్ని ఇష్టపడతాను.
నీవు లేనట్లుగా, మరణించినట్లుగా దుఃఖం పొర్లుతూంటుంది.
ఒక్క మాట, ఒక్క చిరునవ్వు చాలు నాకు
అది నిజంకాదు అన్న ఆనందం వెల్లివిరుస్తుంది.

### 16. నా సంధ్యాకాశంలో (In My Sky As Twilight)

నా సంధ్యాకాశంలో
నాకిష్టమైన రూపం, రంగులతో ఉండే ఓ మేఘానివి నీవు.
తీపిపెదాల ఓ మగువా
నీవు నాదానవు, నీవు నాదానవు.
నా అనంత స్వప్నాలు నీ జీవితంలో ఉన్నాయి.

నా దీపం నీ పాదాలవద్ద రంగులద్దుతోంది.
నా చేదు సారాయి నీ పెదవులకన్నా తీయగా ఉంది.
నా సాయింకాల గీతాన్ని తుంపుకు పోయేదానా
నీవు నా దానవని ఈ ఏకాకి కలలు ఎలా నమ్మేది!

నీవు నాదానవు, నాదానవు అంటూ
మధ్యాహ్నపు గాలులపై అరుస్తాను.
నా ఒంటరి స్వరాన్ని ఈడ్చుకుపోతుంది గాలి.
నా కనులలోతులను వేటాడేదానా!
నీ దాడితో నాపై నీ చీకటి కరుణ వర్షిస్తుంది.

ప్రియతమా!
నీవు నా సంగీత జాలంలో చిక్కుకొన్నావు.
నా సంగీతజాలాలు ఆకాశం కంటే విశాలమైనవి.
నీ సంతాప నేత్ర తీరాలపై నా ఆత్మ ఉదయిస్తుంది.
నీ సంతాప నేత్రాలలో స్వప్నలోకం మొలకెత్తుతుంది.

## 17. చిక్కువడిన నీడలు (Thinking, Tangling Shadows)

లోతైన ఏకాంతం నిండా చిక్కువడిన నీడలు.
నువు ఎవరూ చేరుకోలేనంతసుదూరంగా ఉన్నావేమో! మరీను.
ఆలోచనలనిండా స్వేచ్ఛావిహంగాలు, కరుగుతున్న చిత్రాలు,
కూరుకుపోతున్న దీపాలు.

దూరంగా పొగమంచు కాలి అందియల ఘులఘులలు.
ఉక్కిరిబిక్కిరిచేసే వేదనలు ఆశానీడలను చెల్లాచెదురుచేస్తున్నాయి.
మెల్లమెల్లగా రాత్రి నిను కౌగిలించుకొంటుంది.

నీ రాకకు ముందు నా జీవితపు పాయలనన్నీ
స్పృశించేసానని అనుకొంటాను. నా వొగరు జీవితం.
సాగరం వైపు తిరిగి అరచే అరపులా
శిలలమధ్య నీటి తుంపరలో పిచ్చిగా స్వేచ్ఛగా తీవ్రంగా
విరుచుకుపడుతూ అంబరాన్నంటుతో
వడివడిగా పర్వులిడిన నా వొగరు జీవితం.

నా మగువా?
అప్పుడు నీవు ఎలా ఉండినావు? ఏ కిరణం ?
ఆ విస్తారమైన వింజామర ఒకానొక తూలికవా?
చాలా దూరంగా ఉన్నావు ఇపుడు
వనంలో కార్చిచ్చు!. శిలువపై జ్వాల
మంటలు ఎగసే కొలిమి
కాంతి తరువులలో మెరుపు తళుకు.
మంటలు, మంటలు ఎగిసిపడే చిటపటలతో

నా ఆత్మ నర్తిస్తోంది దహించే జ్వాలలతో

ఎవరు పిలుస్తున్నారు. నిశ్శబ్దం ప్రతిధ్వనులతో నిండింది.
వేదనా ఘడియ ఇది. ఆనంద ఘడియ ఇది.
ఏకాంత ఘడియ ఇది. అన్నిటికీ మించి నా ఘడియ ఇది.

వేటకాని కొమ్ము బూరలోంచి గాలి ప్రవహిస్తూంది పాటై.
శోకోద్రేకము నా దేహాన్ని చుట్టుకొంది.

అన్ని వేళ్లనూ తెంపుకొని, అన్ని అలలను ఎదుర్కొంటూ
నా హృదయం లోతైన ఏకాంతంలో దీపాలను పాతుకొంటూ
ఆనందంగా శోకిస్తూ అనంతంగా సంచరిస్తోంది.
ఎవరు నీవు, ఎవరు నీవు?

## 18. Here I love you

ఇక్కడ నిను నేను ప్రేమిస్తున్నాను.
పైన్ వనాల చీకట్లలో గాలి స్వేచ్ఛప్రకటించుకొంది.
నీటి అలలపై చంద్రుడు భాస్వరమై వెలుగుతున్నాడు.
అన్నీ ఒకేలా ఉండే రోజులు, ఒకదానినొకటి తరుముకొంటున్నాయి.

పొగమంచు అస్పష్ట రూపాలతో నర్తిస్తోంది.
ఓ వెండికొంగ ఎక్కడనుంచో వచ్చి వాలింది
మరొకటి తారలదాకా ఎగురుకొంటో సాగింది.

ఒకోసారి తొందరగా మెలుకువొచ్చేస్తుంది.
నా హృదయం తడిచిపోతుంది.
దూరంగా సముద్రం ధ్వనిస్తోంది ప్రతిధ్వనిస్తోంది.
ఇది ఓడరేవు. ఇక్కడే నిన్ను నేను ప్రేమిస్తున్నాను.

ఇక్కడే నిను నేను ప్రేమిస్తున్నాను.
దిగంతాలు నిను దాచేయాలని ప్రయత్నించాయి వృధాగా.
దహించే ఈ శీతగాలుల మధ్య కూడా నేనింకా నిన్ను ప్రేమిస్తూనే ఉన్నాను.
ఏనాడూ తిరిగిరాని భారీ ఓడలపై నా ముద్దులను పంపుతూనే ఉన్నాను.

పాతలంగరులులా నన్ను నేనే మరచిపోతున్నాను.
మధ్యాహ్నం లంగరు దింపుతోంది శోక తీరంపై.
నా జీవితం అలసిపోయింది. నిష్ప్రయోజనంగా అనిపిస్తోంది.
నా వద్దలేనిదానిని నేను ప్రేమిస్తున్నాను.
నీవు చాలా దూరంలో ఉన్నావు.

నా విరక్తి మసకసంధ్యలతో పెనుగులాడుతోంది.

కానీ రాత్రి వచ్చి నాకు పాటలు వినిపించి సాగిపోతూంది.
చందమామ తన స్వప్నాల కీలుబొమ్మలను ఆడిస్తూంది.
పెద్దపెద్ద నక్షత్రాలు నీ కళ్లతో నన్ను చూస్తూంటాయి.
నేను నిను ప్రేమిస్తూండగా
గాలిలోని పైన్ తోపులు తమ ఆకుల తంత్రులతో నీ పేరును మ్రోగిస్తున్నాయి.

## 19. Girl Lithe and Tawny

చలాకీ నల్ల పిల్లా
పండ్లకు రూపాన్ని, గింజలకు నిండుతనాన్ని
సముద్రనాచుకు వంపులను ఇచ్చే సూర్యుడు
నీ దేహంనిండా ఆనందాన్ని, కనులలో కాంతిని
పెదవులపై నీటి దరహాసాలనూ నింపాడు.

నీ నల్లని కురుల పాయలలో నలుపు కోర్కెల సూర్యుడు పెనవేసుకొని ఉన్నాడు.
నీవు సెలయేరుతో క్రీడించినట్లే, సూర్యునితోకూడా ఆటలాడతావు.
నీ కనులు రెండు నల్లని సరోవరాలు.

చలాకీ నల్ల పిల్లా
నీ వైపుకు నన్నాకర్షించేదేమీ లేదు.
ప్రతీదీ నన్ను నీనుంచి దూరం చేసేదే. నీవేదో మిట్టమధ్యాహ్నపు వేళైనట్లు.
నీవు తేనెటీగ అవిశ్రాంత యవ్వనానివి
కెరటాల ఉన్మత్త వినోదానివి. వరి కంకుల దాగిన బలానివి

నీ చలాకీ దేహమంటే నాకిష్టం. నీ సన్నని ప్రవహించే స్వరం అంటే నాకిష్టం.
నా దుఃఖిత హృదయం నిన్ను నిత్యం అన్వేషిస్తూనే ఉంటుంది.
నల్లని సీతాకోకచిలుకా!
వరిచేను సూర్యుడు నీరు సారాయిల్లా నీవు చాలా స్పష్టమైనదానవు.

## 20. Tonight I Can Write

ఈ రాత్రి నేను అత్యంత విషాద వాక్యాలను వ్రాయగలను.
"దూరంగా వణుకుతోన్న నీలి నక్షత్రాల ఈ రాత్రి" లాంటివి.

రాత్రి గాలి, ఆకాశంలో సుళ్లుతిరుగుతూ పాడుతూంది.

ఈ రాత్రి నేను అత్యంత విషాద వాక్యాలను వ్రాయగలను.
తనను నేను ప్రేమించాను. ఒక్కోసారి తనుకూడా నన్ను.

ఇలాంటి రాత్రులలోనే నేన్తనని నా చేతుల్తో చుట్టేసి
అనంత ఆకాశం క్రింద పదే పదే ముద్దులాడేవాడిని.

ఆమె నన్ను ప్రేమించింది. ఒకోసారి నేను కూడా తనను.
తదేకంగా చూసే ఆమె విప్పారిన కళ్ళను ప్రేమించకుండా ఎలా ఉండగలను.

ఈ రాత్రి నేను అత్యంత విషాద వాక్యాలను వ్రాయగలను
నాకామె లేదనీ, నేనామెను కోల్పోయానని తెలుసుకొనటానికి

ఆమెలేనితనం వల్ల మరింత చిక్కబడ్డ రాత్రిని వినటానికి
పచ్చికపై రాలే మంచులా పదాలు హృదయంపై కురుస్తున్నాయి.

నా ప్రేమ ఆమెనెందుకు నిలువరించలేకపోయిందనేది కాదు సమస్య
ఈ తారల రాత్రి ఆమె నాతో లేకపోవటమే.

అంతే! అంతకు మించేమీ లేదు. దూరంగా ఎవరో పాడుతున్నారు.
తనను పోగొట్టుకున్నందుకు నా మనసుకు అశాంతి మిగిలింది. అంతే!

నా చూపు ఆమెను వెతుకుతోంది, తనను నా దరి చేర్చటానికై.
నా హృదయం ఆమెకై చూస్తోంది. ఆమె నాతో లేదు.

అదే రాత్రి అవే చెట్లు అదే వెలుతురు
కానీ మేమిరువురమూ అప్పటిలా లేము.

ఇకపై నేనామెను అంతలా ప్రేమించకపోవచ్చు. నిజంగానే.
కానీ ఆమెను నేను ఎంతెలా ప్రేమించానూ?
నా స్వరం గాలిలో తడుముకొంటోంది, ఆమె చెవుల కోసమై.

మరొకరిది. ఆమె మరొకరిది. నేను తనను ముద్దులు పెట్టుకోకముందు లాగానే
తన స్వరం, తన మేని మిసిమి, తన విప్పారిన కళ్లు అన్నీను.

ఇకపై నేనామెను అంతలా ప్రేమించకపోవొచ్చు. అది నిజం. ఏమో ప్రేమించవచ్చేమో!
ప్రేమ క్షణికమే, మరిచిపోవటం సుదీర్ఘంగా ఉంటుంది.

ఇలాంటి రాత్రులలో ఒకప్పుడు తను నా కౌగిట ఉన్నందుకేనేమో
తనను కోల్పోయినందుకు నా హృదయంలో అశాంతి.

బహుశా ఇదే తను నాకు చేసే చివరి గాయం.
ఇవే నేనామెకు వ్రాసే ఆఖరి వాక్యాలు.

## 21. విషాద గీతం (The Song of Despair)

నన్నావరించిన ఈ రాత్రిలోంచి నీ జ్ఞాపకం పైకి లేస్తుంది.
నది తనకు లోబడని విలాపాన్ని సాగరంలో కలుపుతూంది.

ఉదయపు వేళ నిర్మానుష్యంగా ఉండే రేవులా ఈ ఘడియ బోసిపోయింది.
ఇక వీడ్కోలు చెప్పుకోవల్సిన సమయమాసన్నమైంది.

హృదయంపై చలి సుమాల వాన కురుస్తోంది.
కూలిన ఓడ కుహరంలోకి చెత్త పేరుకొంటోంది.

నీలో పోరాటాలూ, పలాయనాలు పోగుపడి ఉన్నాయి.
నీ నుంచే పక్షి పాట తన రెక్కలు విప్పుకొంది.

దూరంలా సాగరంలా కాలంలా నీవు సర్వాన్నీ మింగేసావు.
నీ లోతుల్లోకే సమస్తమూ కూరుకుపోయాయి.

దండయాత్రలతో, చుంబనాలతో నిండిన సుఖ ఘడియ ఇది.
ఆ ఘడియ ఇంద్రజాలం లైట్ హౌస్ లా తళుక్కుమంది.

చోదకుని భయం, అంధ సారధి ఆగ్రహం, ఎగసిపడే ప్రేమ మత్తు
అన్నీ నీలో మునిగిపోయాయి.

బాల్యపు పొగమంచులో నా ఆత్మ రెక్కలు తొడిగి, గాయపడింది.
తప్పిపోయిన శోధకా! నీలో అన్నీ మునిగిపోయాయి.

నీవు విషాదాన్ని ధరించావు. మోహాన్ని మోస్తున్నావు.
బాధ నిన్ను గింగిర్లు కొట్టిస్తూంది. నీలో అన్నీ మునిగిపోయాయి.

ఆశకు సాఫల్యానికి మధ్య ఉండే గోడల నీడను చెరిపేసాను. ముందుకు సాగాను.

ఓ శరీరమా! నాదే అనుకొన్న ఓ స్త్రీ శరీరమా! ఈ చిత్తడి ఘడియలో నిన్ను ఎలుగెత్తి పిలుస్తున్నాను.
నా పాటను నీకోసం గొంతెత్తి గానం చేస్తున్నాను.

ఓ కూజాలా నీవు అనంత మృధుత్వాన్ని ఇముడ్చుకొన్నావు.
అనంత అనామకత్వం నిన్ను కూజాలా పగలగొట్టింది.

నా ప్రియమయిన దానా! ఆ దీవుల నల్లని ఏకాంతంలోనే కదా
నీ చేతులు నన్ను నీ లోనికి లాక్కొన్నాయీ!

అక్కడ నా దాహానికి, ఆకలికీ నీవు పండువయ్యావు.
అక్కడ నా బాధకు, పతనానికీ నీవు మహిమవయ్యావు.

ఓ మగువా! నీ హృదయ మన్నులో నన్నెలా ఇముడ్చుకోగలిగావో
నీ చేతుల శిలువలో నన్నెలా బంధించగలిగావో నాకు తెలియదు.

నీపై నా కోర్కె ఎంత క్షణికమో, ఎంత భయంకరమో
ఎంత కష్టమో, ఎంత మైకమో, ఎంత ఆత్రమో, ఎంత ఉద్రిక్తమో కదూ!

చుంబనాల శ్మశానమా! నీ సమాధులలో ఇంకా నిప్పుంది.
పండ్ల కొమ్మలు ఇంకా మండుతూనే ఉన్నాయి. పిట్టలు పొడుస్తూనే ఉన్నాయి.

చేదు నోరు, ముద్దాడే చేతులు, వెతుక్కొనే పెదవులు
పెనవేసుకొనే దేహాలు – ఆహ్ అన్నీ అద్భుతాలే.

ఆశ, అధికారముల పిచ్చి కలయికలో మనం కలుసుకొని విడిపోయాం.
నీటిలా, పిండిలా ఉండే మృధుత్వం. పదం ఇంకా పెదవులపై రానే లేదు.

ఇదే నా రాత! ఇదే నా నిరీక్షణా యానం. ఇక్కడే నా అన్వేషణ రాలిపడింది.
నీలోనే అన్నీ మునిగిపోయాయి.

ఏ విషాదాన్ని నీవు పలికించలేదో, ఏ విషాదంలో నీవు మునిగిపోలేదో
అన్నీ నీలోకే కూలాయి.

కెరటం వెనుక కెరటం కొడుతున్నా
తెరచాపకొయ్యను కరచుకొన్న కళాసిపై నీవు పాటనాపలేదు

చెత్తా చెదారలతో నిండిన గొయ్యిపైనప్పటికీ నీవు పాటల్ని పుష్పించావు.
కెరటాలై ఎగసిపడ్డావు. తెరచుకొని చేదుగా వినిపించావు.

అంధ నావికా, దురదృష్ట వేటకాడా! తప్పిపోయిన శోధకుడా!
నీలోనే అన్నీ మునిగిపోయాయి.

ఇక వీడ్కోలు సమయమాసన్నమైంది. చలిలో గడ్డకట్టిన ఘడియ ఇది.
అన్ని పంచాగాల్లోనూ ఈ ఘడియను తగిలించింది రాత్రి.

సాగర వడ్డాణం తీరాన్ని చుట్టుకొంటోంది.
నక్షత్రాలు చలిని పెళ్లగించుకొని బయటపడుతున్నాయి.
రాత్రి పక్షులు ఎటో సాగిపోతున్నాయి.

ఉదయపు వేళ నిర్మానుష్యంగా ఉండే రేవులా
వణుకుతూన్న నా నీడే నా చేతిలో గజగజలాడుతున్నది.

సుదూరంగా. అన్నిటికన్నా సుదూరంగా.
త్యజించిన ప్రియురాలా! వీడ్కోలు తరుణం వచ్చేసింది.

**Telugu Translation of Pablo Neruda's Twenty Love Poems and a Song of Despair by Bolloju Baba**

**Period of Translation: February to August 2010**